శ్రీ

# రుక్మాంగదచరిత్రము

## యక్షగానము

ఉ. శ్రీమదభీష్టవుందవికిఁ జిక్క ధరాసతి కన్నదామరల్
పాత్రిముఖుండు నవ్వ చింతపలిపాటిపురీనిలయుఁడు చెన్నకేశవ
స్వామి రమావినోదపురసంజ్ఞనిఁ గొల్చెడు వాలుమాపులన్
వేమరు నిమ్మరాట్టులుని వేంకటరామయమంత్రి నేలుతన్.

సీ. ఏనుఁగుమొగంబు కొడుకని యేవగింప
కమ్మలియువుప పెను గారవమ్ముఁ జూప
మొక్కువారల కార్యమున్ దక్కఁబరుప
నేర్పుకాఁడగు జోకయ్య నేఁ దలంతు.

ఖరహరప్రియరాగం.

1. కరుణింపుము దేవ గజానన । నిరతము నీపాదచరణ
కమలములే స్మరియింపక మాన॥ గజానన॥ కరు॥
2. పరమపవిత్ర భాసురగాత్ర । యురగయక్షనుతగా
త్ర॥ పురహర వరపుత్ర॥ కరుణిం॥
3. కార్యభంగములఁ గడముట్టింపుము । ఆర్యా విఘ్నవినా
యక॥ ఆర్యజనగేయ॥ కరు॥

4. చింతపల్లిపురవరనిశాంత సీమంత యోగదంతా॥ గ॥ సంతో
షితస్వాంత॥ శర॥

చ. తిలకము దిద్ది నెన్నొసటఁ దీరగుపావడబొట్టుఁ దీర్చి మే
ల్జిలుగుబటాణిఁ గట్టి శుకిచేతను పాంపగుపీఁగ బట్టి పా
బల్కుఁ గలుక్కుటందియలపాదము ఘల్లుఘల్లు మ్రోయ నాడుచు
న్నలువమొగంబునం గులుకు నాకులవాలిక వాణిఁ గొల్చెదన్.

సురట—ఆది.

1. వందే జగజ్జననీం భారతీం । వందారుజనతామందార
మాలాం కుందాభరదనా మిందుబింబాస్యాం॥ వం॥

2. పద్యగద్యముఖభావ్యాత్రయసంచారిణీం । మణిహారిణీం
పద్యన్నుంజాతవిద్యుల్లతాంగీం విద్యారూపిణీం విధాతృ
గృహిణీం॥ వం॥

3. పంకేజాక్షీం చింతపల్లిపాటిపురసదనాం । శ్రీహర్మ్యాణవ
ధనాం కంకణకింకిణీక్రింకారలసితాం వేంకటరాయాభి
ధానవినుతాం॥ వందే॥

—• తోహర •—

శ్రీమహీశాధిప చెన్నకేశవస్వామి శార్ఙ్గచాప
శ్యామరూపనవబర్హికలాపక ప్రసుప్రీతావ
వాణింగొలిచి శర్వాణిఁ దలంచి వాణిరాణిఁ బ్రస్తుతించి
పాణిని వల్మీకభవ వ్యాసుల ప్రతిభను గొనియాడి
వాగనుశాసనుఁ దగు నన్నయకవివర్యుఁ బ్రస్తుతించి
యాగవిధాతను దిక్కయజ్వ నెఱ్ఱాప్రెగ్గడ వేఁడి

వర్థిచకోరనేత్రానందసంధాన
రాజతుల్యులు నిమ్మరాజువారు
గీ. మానినీసరసిభావ్యమాణ మనుజ
రాజహంసలు శ్రీనిమ్మరాజువారు
చక్రిదాస్యసమృద్ధినిర్వక్రమోక్ష
గాప్తికాములు మానిమ్మరాజువారు.

—తోవార—

తమ్మికొలంకున నెమ్మిమావలయు కెందామరలో యనఁగ
నిమ్మరాజకులతిలకులు విప్రులు నెగడి రఖలదిశల.
సీ. బసవరాజాఖ్య కల్పకశాఖ కెవని శు
భావతారము వసంతాగమంబు
ఆదినారాయణాహ్వయహృదామోదప్ర
రోహ మెవ్వనినవ్యరూపురేఖ
అన్నమ్మగర్భవారాన్నిధి కెవని య
భ్యుదయంబు శీతకరోదయంబు
తులకింప వేంకటాచలసహోదరతకైఁ
దాల్చె నెవ్వఁడు దానధైర్యముదగ్రి
గీ. కంబుకలధౌతకైలాసకామధేను
కాశకలహంస విశదవిఖ్యాతకీర్తి
యతఁడు వేంకటకృష్ణనామాంకరమున
దనరు వేంకటరామపరిథానమాళి.

సీ. వేంకటరాయపృథ్వీసురవహాళి యె
వ్వనియుపశాఖకు వంశకర్త
వేంకటకృష్ణనామాంకితుఁడైన త
త్పూజ్యుఁ డెవ్వనికిఁ బితామహుండు
వేంకటరామాఖ్యవిబుధుఁ డెవ్వానికిం
జేర్మిఁ గూర్చిన యట్టి పెంపుతండ్రి
ప్రాతచరిత్రప్రభూతసద్గుణమణి
వ్రాత సీతాంబ యెవ్వానిమాత
లక్ష్మిదేవమ్మ యెవనికులంపుఁగొమ్మ
యాత్మజుం డెవ్వనికి వేంకటాచలపతి
యట్టి శ్రీనివాసరాజవంశాంబురాశి
రామచంద్రుఁడు వేంకటరామమంత్రి.

వ. మఱియు నమ్మంత్రివసంతుఁ డనంతవరపవిత్రాంత
గ్రామం బగుచింతపల్లి పాటియందుఁ జెన్నకేశవాలయంబు జీర్ణో
ద్ధారణంబుఁ జేయింపు నుం గతిపయదినంబు లందుండి యొక్క
నాఁడు శ్వశురనివాసంబున కరుగుదెంచి కృతపరిచితిగలవాఁ
డగుటం జేసి వంగలకులాలంకారుఁడ నగునన్ను రావించి శ్లాఘ
నోక్తిపూర్వకంబుగా నిట్లనియె.

ఉ. చింతపల్లిపాటి చెన్నకేశవునకు
నర్పణముగ కేశవాంకితముగ
వకుళమాలభంగి వలపుట్టిపడఁ జమ
త్కృతిగఁ గృతియొనర్పు కృష్ణయకవి.

వ. అనుటయు.

క. తపనీయవాసునకుఁ జెం
తపల్లిపాటినగరధాముసకుఁ బతి
త్రిపురఘునకుఁ బాలిత కే
కిపవాహానునకును జెన్నకేశవున కొగిన్.

వ. సముర్పణంబుగ నాచేర్పుకొలంది రచియింపనుద్యో
గించిన రుక్మాంగదచరిత్రమునకుం గథాక్రమం బెట్టిదనిన.

— • తోహార • —

శ్రీమంతంబు జగత్పావన మగునై టుకొవఁ మంకు
కామసై రినన్నిభు లనవద్యు లఖండ పోనులు.

వ. పరమతపోవ్యవసాయసంపన్నులై బ్రహ్మాద్యా దై
వరమహర్షులైన మహర్షులందఱు,

• తోహార • —

విష్ణుదేవునకు నర్పణంబుగా విధివిధాన నమున
వైష్ణవయాగముఁ జేయుచుండుతరి వచ్చె సూతుం డటకు
వచ్చినమాతుం గనుంగొని మౌనులు వ్యాసశిష్యుఁ దెచ్చి
చెచ్చెర పాద్యం బిచ్చి సముచితాసీనుం గావించి
పరమానందరసాంబుధిఁ దేలుచుఁ బార్గ్యవ త్తు బగుచు
హరికథామృతముఁ గోరుతలంపున నమ్ముని నిట్లనిరి.

దర్బారు—ఏకతాళము.

1 వందన మిదిగో నార్య పౌరాణిక వర్యా నందితగుణధుర్యా
వర్జితవిజితసురాచార్యా॥ వం॥

2. చింతపలిపాటిపురనికాంతమున వెలయు కమలాకాంత
ప్రియభక్తుని వృత్తాంతము వింత రవ్వంత॥ ఇ॥

తోహర

భూరమణీమణికంఠహారవిస్ఫూర్తి సనుకరించి
వీరవ్రతులకు జన్మభూమి యన విదిశాపుర మమరు.

క. ఆ నగరీవిభవము వల
కానగరముకంటె మిన్నకలచందంబున్
బూని నగ్గింపఫణిపతి
కేని యసాధ్యము విధాత నెన్నంగ సేలా॥

తోహార

బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లప్పట్టణంబువారు
బ్రాహ్మణభక్తిపరాయణులై యెప్పట్టున మెలంగుదురు.

సీ. కన్యకావిక్రయకలనం దేలినవారు
వేదవిక్రయము గావించువారు
అన్నవిక్రయమునం దాటిలేరినవారు
మాంసవిక్రయమున మనెడువారు
మద్యవిక్రయమున మను వృత్తిగలవారు
దివిరిక లంచమునం దినెడివారు
ప్రాణిహింసాసక్తి బ్రిబలి కుర్మ్మరువారు
పుణ్యవిక్రయమునం బొదలువారు
గీ. చోరవృత్తికిం బొరుగిండ్లు సొచ్చువారు
జారవృత్తికి నెటకేని సాగువార

ఎదుటిమేలుకు లోలోన నేడ్చువారు
లేమిచేఁ గుందువారలు లేరు లేరు॥

తోహర

విదిశానగరము రాజధానిగా విక్రమకంఠీరవుఁడు
మదిరాక్షీనవమదనుఁడు రుక్మాంగదుఁ డేలుచునుండు
పట్టమహిషిసంధ్యావళి రెండవభాగ్యలక్ష్మియై కొలువ
పట్టణమేలును జన్యజనకభావంబు ప్రజలపై నిలువ.

వ. అంత నొక్కనాఁడు రుక్మాంగదమహీవల్లభుండు మంత్రి సామంత విద్వజ్జన పురోహిత హిత నట విట కవి గాయక వందిజనంబులు గొలువఁ గొలువుండి "జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబ" యను శ్లోకపాదముం దలంచి యనుపమానతపోగరిష్ఠుండు బ్రహ్మర్షిశ్రేష్ఠుండును దమకుల గురుండు నగువశిష్ఠమహాముని రావించి భక్తినయుక్తి నాన నార్ఘ్యపాద్యాదివిధానంబులఁ బూజించి విదిశాధిపుం డిట్లనియె॥

గీ. ఏవ్రతము సలుప సంతానవృద్ధి కలుగు
నేవ్రతముఁజేయ సమకూరు నీప్సితార్థ
మందు నిందును జిరసుఖ మబ్బఁజేయు
నట్టిసువ్రత మొక్కటి యానతిమ్మ॥

తోహర

వినయవివేకంబులతో నరపతి వేఁడిన పలుకాలించి
జననాథున కిట్లనియె దపసి వాత్సల్య మతనిపై నునిచి.

కీర్తన

ఏకాదశీపుణ్యవ్రత మాచరింపుమయ్య సాకల్యముగ
వినుము నరోత్తమ బుధి శోకమోహాఘ్నుల సోకంగ
నీయనిది॥ ఏకా॥

1. పామరులకైన బండితులకైన గామక్రోధాదులఖండిం
చువజ్రమిది సకలేంద్రియములచాంచల్య ముడిగించి
త్రికరణశుద్ధి సుస్థిరముగఁ గల్పించు॥ ఏ॥
2. ఆకలిదప్పులనడఁచి కలకాలము శ్రీకాంతునిచరణసేవ
మరగించును॥ ఏ॥
3. చింతపలిపాటిచెన్న కేశవుని కరుణ్యంగాప్రీతికర మపవర్గ
దాయకము॥ ఏ

వ. రాజన్! ఏతద్విధాన మెట్టివారైన దశమినాఁ డేకభుక్తము నేకాదశియందు నిరాహారముగ నుండవలయు అహోరాత్రంబు హరిస్మరణపూర్వకముగ శ్రీపతిని పూజింపవలయు జాగర మాచరించి మరునాఁడు ద్వాదశీపారణము సకాలమందు ముందు బ్రాహ్మణుల భుజింపఁజేసి పిమ్మటఁ దాను సుహృజ్జనులతోడ భుక్తిసలుపవలయు. పగలు నిద్రింపరాదు. ద్వాదశి నాఁటిరేయి నశనంబుగుడువక యంగనాసంగమం బొల్లక నీమం బీడేర్పవలయు. ఇది యుత్తమోత్తమం బగువ్రతరాజము దీని నుల్లంఘింపనివారికిం గైవల్యంబు కరతలామలకంబు.

దోహర

ముదమున హరివాసరమున గుడిచిన మనుజునిపాతకము
సదమలచరిత యొన్నిపున్నెములు సలిపిన జెడదుసుమి

గురుభామాంతు దురితంబేనియుఁ గూలిపోవుగాని
హరివాసరభుక్తాన్నదోష మడుగంటదు నరనాథా
గరువశనంబున నీవ్రతముఁ బరిహరింతురేని
నరకకూపమున బడుట నిశ్చయము తరణికులాధరణా.

ఆ. అలుక చేతనైన నశనమబ్బమినైనఁ
దెగులుచేతనైనఁ దెగువనైన
సారిది హరిదినమున శుష్కోపవాసంబు
సంభవించునేని జాలమేలు.

తోహర

తిండిపోతులకు నీ నియమము పెనుగొండవలెన్ దోఁచు
రెండవపద్ధతిఁ దెల్పెద విను ధాత్రీతలనాథమణీ.

క. ఇట్టి కృతోపవాసవు
కట్టడి నిలుపంగ లేని కాపురుషులకుం
బొట్టేదియు నట్టయినను
బట్టెడుపిష్టమ్ము నేని భక్షింపఁదగున్॥

తోహర

అనుచు వసిష్ఠుఁడు దెల్పి యథేచ్ఛన్ జనిన యనంతరము
మనుదవరేణ్యుఁడు మంత్రివిబుధసామంతాదులఁ జూచి

ఆ. ఈవ్రతంబునలిపి యిష్టార్థసంసిద్ధిఁ
బడయవచ్చునని సభాజనమ్ము
లాలకించి మిగుల హర్షసమేతులై
హితవు మీర నృపతి కిట్లు లనిరి॥

## కీర్తన

మే మీవ్రతముఁ జేయుదు మో భూపతీ మీపాదంబు
లాన యో భూపతీ స్వామి నీయాజ్ఞ మీరఁగలమా॥ మే॥

1. గురువాక్యమునందు గురినిల్పుచు హరివాసరమందు ము
మువక॥ మే॥

2. జన్మవ్రతంబుగ నాచరింపుచునవ్యగ్రముతోడ భూపతి॥ మే॥

3. చింతపల్లిహరివారిని సేవింతుము ఇంతకంటె సుకృతి
మెయ్యది॥ మే॥

## తోహర

ఎల్లవారు శ్రీహరిదివసవ్రతి మెవ్వర్ చేయుం డని
పల్లెం బట్టణములలోఁ జాటఁబంపెఁ నృపవరులన్.

వ. అంత నాతలవరులు కంఠశారాహతతూర్యనినాదంబు
లతోడ రాజవీథులయందుఁ దిరుగుచు రాజాజ్ఞను బ్రజలకు విను
పించు కొలం గట్టి దనిన॥

క. హరిదినము నేకభుక్తము
హరిదినమునఁ గేవల నిరాహారులరై
హరిఁబూజింపుచు లలి జా
గరమును నెపరక సల్పఁగావలయుఁ జుండీ॥

క. ద్వాదశిపారణ హరికిని
వేదించిన శేషముగ యర్థివిప్రజనుల కా
త్యాదరమున నిడుసజ్జను
లావటసాయుజ్యపదవి నందెదరు సుండీ॥

తోహర



తప్పరాదురాజాజ్ఞనుఁడి యిదితప్పినపాపముసుండి
తప్పక వ్రతము సేసినవారికిఁ దప్పదు మోక్షముసుండి॥

వ. ఇట్లు పాటుటయుఁ గొన్నాళ్ళకు దైవవశంబున హరివాసరం బాసన్నంబయ్యె నంత రుక్మాంగద ప్రముఖులైన సామంతులందఱు

హంసగతిరగడ

స్నానమొనర్చిరి సంధ్యనువార్చిరి, మౌనతహరినామములు జపించిరి, దశమినేకభుక్తముగావించిరి, వశమతులై యుపవాసంబుండిరి, హరిమంటపమని యటనేర్పరచిరి, హరిని శ్రీరమణినారాధించిరి, కలువపూలతో కనములుగట్టిరి, మలయజగంధాక్షతము బెట్టిరి, అలరుతేనెతో నర్ఘ్యంబిచ్చిరి, క్షీరోలున నభిషేకమొనర్చిరి, తులసీదళములతో నర్చించిరి, వాలిదిరాని వ్రాళులొనగిరి, పద్మాప్రియుఁడని పాటలుబాడిరి, పద్మనాభుఁడని భజనలు జేసిరి, శరణని మొక్కిరి శార్ఙ్గధరునకుం, శరణని వేడిరి చక్రాయుధునిం, బరిహరింపుమా పాతకమనుచుం, గరిమ మెలయ జాగరమొనరించిరి॥

గీ. దినము తెల్లవారఁ గానె పూర్వకొండ న
త్తమున్నందు మునువవమున్నతోన
బొంకములు తనర్చు మంకెనపువ్వన
బాలసూర్యుఁ డొప్పెఁ బ్రాక్సతిరిని.

—• తోహర •—

ప్రాతిస్నాన మొనర్చి పార్థివుఁడు భాస్కరు సేవించి
చేతఃప్రీతిగ ద్వాదశిపారణ సేయఁబ్రయత్నించి
శిష్టుల నిష్టుల బాంధవజనముల స్త్రీల కుటుంబినుల
శ్రేష్ఠులైన బ్రాహ్మణుల సహపంక్తి శేఖులఁ దీర్చెంచె.

వ. అంత రుక్మాంగదమహారాజు తనయూరిలోని శివకేశవాలయంబుల కేగి యాదేవతాసార్వభౌములకు షోడశోపచారపూర్వకముగ సహస్రనామార్చనంబుం జేయించి తీర్థప్రసాదంబు లందికొని నిజమందిరంబునకు వచ్చెనట.

—• తోహర •—

ఏ వీథులఁ బరికించిన నగరం బేవాడం జూడఁ
బావన మగునేకాదశీవ్రతము పాటింపందొడఁగ
ధారుణీసురుల నవరసైన శ్రద్ధాభక్తిం జూః
పారణకు మాయింటికి రమ్మని బతిమాలెడువారు
కాంతలు పురుషులు పట్టాంశుకములఁ గట్టి సోయగముగ
సంతర్పణ మనువింతగ బంతులు సాగించెడువారు
ఆమదానముల నన్నదానములు నాచరించువారు
అమితభక్తి తాంబూలదక్షిణల నర్పించెడువారు.

ఉ. పౌరులచర్యఁ గన్గొని ప్రవృత్తి మెచ్చుచు సౌఖ్యశీలుఁడై
తోరపుశాకపాకములతోఁ దగు భోజనశాల ద్వాదశీ
పారణఁ జేసి భూమిపతి బ్రాహ్మణభక్తిపురస్సరంబు బం
గారమువన్నె మించు నలిగారపుకూటమి నంతు నెన్నఁగన్

—• తోహా •—

శ్రీకాంతున కర్పణముగ వ్రతముంజేసిన పుణ్యమున
వేకటి యేర్పడి సంధ్యావళికిన్ వేవిళు లుదయించె

సీ. కన్నులతేటవచ్చెనయొుండీగెనా
 దీగెఁగోఁతికి మేను తెల్లవారె
ముకురమందలి గంధవుంబూవు కైవడి
 దేరవఖం జెక్కుటెళ్ళ దెలుపుమించె
తేదమ్మిమొగ్గ వ్రాలిన తేటతోకునా
 నారికిం జనుమొనల్ నల్లవారెఁ
జెదరి చేద్పదు గండుతుమ్మలవారన
 వెలఁదికి నూగారు విరియఁబారె
తే. గీ. మంచుదొరఁగిన చంద్రబింబమ్ముపగిఁగ
 మోము వెల్వెలబారె కెమ్మోవిమారె
 గలికినడ మాంద్యమూనెను గాను బలసె
 నెలతుకకుఁ దొమ్మిదవనెల నెమ్మినిండె.

తోహర.

సితపక్షంబున గ్రహములుచ్చగతిఁ జెందినకాలమునందు
సుతుఁ డుదయించెను సంధ్యావళికిన్ శుభలగ్నమునందు

వ. శ్రీమతి పట్టపుదేవికిఁ బుత్రోత్పత్తి యగుట కర్ణా
కర్ణికగా విని యంతఃపురస్త్రీలందఱు

కీర్తన.

కన్గొందము రారె తోఁ కనకాంగులార మనసంధ్యావళి
ముద్దులమగబిడ్డం గనెనఁట॥క॥ యువరాజోదయమాయె నన

లా యోమంచు కువలయానందమ్మొక నుపిన చేకురు ॥క॥
నతిపతులొనరించిన వ్రతము ఫలియించెఁ బ్రతిఫలముక్రియ
మాద్దుపాపఁ డుదయించె ॥క॥ లేక లేక మనకు నీకాలమ్మునకు
శేకొనిముద్దాడ శిశువు లభించె ॥క॥ చింతవలిపాటిపుడె శ్రీకాం
తుకృపను సంతాపములే దనిసిదిరి వెనుబడియె ॥క॥

దోహర

జాబిల్లిం గని యానందించెను జకోరయుగము భంగి
నాబాలుఁ గని జట్టుకొనిరి పరమానందంబున బాంగి.

క. పుత్రోదయమాయెనను
ధాత్రిపతికి విన్నవింప ధాత్రి యొకతె యా
మిత్రకులుఁ డొసఁగె కాంచన
గాత్రికి మణిహారమునఁ గొనుకఁ గాఁగన్.

వ. వాసియు సమ్మానితెంచు మహోల్లసంబునఁ బుత్రోత్సవంబు నెరపి పదిరెండవనాఁడు పుణ్యాహవాచనపురస్సరంబుగఁ బుట్టినపట్టికి జాతకర్మ గావించి సకలసత్పురుషసభామధ్యమున ధర్మాంగదుఁ డను నామకరణం బిడుటయు నాబాలకుండు బాలచంద్రుని పోలి దినదినప్రవర్ధమానుండై

తే. గీ. వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుచు
యస్త్రశస్త్రవినోదముం దాఁటి తేరి
పూర్ణచంద్రునిమాడ్కి సంపూర్ణకళల
వరలెడు సిద్ధపురుషులకు పాత్రముగ నుండె.

వ. వెండియునాడగన్ని రాత్రిలోనసినర్గమాహాత్మ్యంబున చైతన్యంబు గల్పించి మోహిని యనిపిలువ నాపుత్రికబొమ్మ

కం. మొలకమిత్తై లేనగవుల
విలచాంబుదనేత్రికళలు వెలయఁ బలికె నా
మకరాంకుశకును గేళి
శుకసల్లాపములమెప్ప నసూయ దవింపన్.

వ. తండ్రీ నావలన గాఁదగుకార్యం బెద్దియో సెలవి మ్మనుటయు.

ఉ. బంగరుబొమ్మ మందరముపై నివసింపుము ధాత్రియందు రు
క్మాంగదుఁడా చరించు వ్రతమాపడిచుచ్చుటకార్యమెంతయుం
బాఁగుచు రాఁగలం డటకు భూపతిరాకకు వేచియుండి నీ
వుం గలనేర్పు సూపి నృపకుంజరు నీదగు బంటుచేయుమా.

—◆ తోహర ◆—

సామాన్యుఁడు గాఁ డానృపాలకుఁడు సద్గుణకల్పకవల్లి
ఏమాత్రికిఁ బి వ్రతమును మరపింతువా నృపతిపైఁ రాగిల్లి

వ. నాపుడు నమ్మోహిని విని నవ్వుచు.

కీర్తన.

1. నాతండ్రి వినుమా నా ప్రజ్ఞఁ జూడుమా యీర్ష్యాగ
ప్రాయమున నింతటినందిగ్ధమా॥ నా॥
2. ఘనకార్యమా యిదే జపకా యసాధ్యమా ఘనుఁ డా
నృపాలుఁడు కానిమ్ము చూతము॥నా॥
3. బోటిలోంగనిపురుషులు గలరా గోటిగాచెకువని
గొడలిగావలయునా॥ నా॥

4. అగఁ డెంతవాఁడు రుక్మాంగదభూపాలుఁడు రతిరాజు
బారి సారంగముగాఁ జేయనా॥ నా॥

5. చింతవలిపాద్భుడశ్రీపతి సాక్షిగఁ బంతమీడేర వ్రత
భంగము గావించెద॥ నా॥

క౦. అనిపగ్గెలాడుచనయ్యెడ
వనజాననుఁ డోనెఁగె జాఱువాపిగోను
గ్రక్కున నా మోహనవృత్తియై
పనివిరెముద పనుచు దివిజవధమున వెడలెన్.

కీర్తన:

1. వచ్చె మోహిని వనజాయతాక్షి విచ్చలవిడితోఁగి వచ్చె
లులనుగూడి॥ వ॥

2. ఇందుశేఖరు నిష కామేశ్వరు డెందమందు నమ్మి మంద
రాద్రి॥ ఇం॥

3. మేటి దింపవలిపాటి మురహరి పైఁబాటపాడుచు నగ్యా
టలాడుచు॥ వ॥

—• తోహర •—

భూలోకంబునఁగలపట్టణములఁ బుణ్యారణ్యముల
లీలాగతిఁ దిలకింపుచు మందరశైలమునకుఁ జేరి.

గీ. మందరగిరిపయిన రత్నకందరంబు
మొగ్రిల మాలూరవని! తూర్పువనధిన
ధారధళ్యవ్రీడా నముద్యోగమైన
యుష్టకామేశ్వరాలయ మంత్రిగాంచె.

వ. అచ్చోట విమానంబు డిగ్గి ప్రియవయస్యలుం దానును పుష్పాంజలులు ఘటించి నవరత్నలింగమునకు నభిముఖులై యిట్లని ప్రస్తుతించిరి.

కీర్తన.

నమో నమో నమశ్శివాయ తే నమో భవాయ తే
ఉమార్ధధాయ శూలినే చంద్రమౌళినే॥నమో॥
కామసంహారాయ నాగకంకణాయ తే గరళగళాయ తే॥నమో॥
మరణవిదూరాయ జగన్మంగళాయ తే నమో భవాయ తే॥
మౌనిసేవితాయ దక్షమఖహరాయ తే నమో భవాయ తే
మంత్రస్వరూపాయ గాంగమస్తకాయ తే దిగంబరాయ తే
చింతపల్లిపురశ్రీధరాయ తే త్రిపురాంతకాయ తే॥

వ. అని యీశ్వరధ్యాననిష్ఠాగరిష్ఠయై శివాలయము నిర్గమించి బహిర్ద్వారంబుముందట శిలావేదికపైన సఖజనముతోడ సుఖాసీనయై వీణాగానము సేయుచుండె నచ్చట.

— తోహర —

వనజసంభవునియాజ్ఞచేత మృగవర్గం బిలపైఁ బుట్టి
మునుకొని రుక్మాంగదునిరాజ్యమును ముట్టడించెఁ జలపట్టి॥

తే. గీ. పంటచేల్మట్టి మల్లాడి పైరుఁ జెఱచి
తోఁటతోఁపుల ఫలవృక్షములను గూల్చి
యడ్డమగువారిఁ జంపి యాపద్దలేక
మెండుకొని తిరుగసాగె నా మృగకులంబు.

వ. ఆ యాగడమునకు నిలువ నీడఁగానక పంటకాఁపులు

ఆలసింపక కష్ట మనికలంపక వాలుమెకంబులను గూల్చ వనము కేగద॥ అ॥

నంతసిల్లుచు మీా మీా సదనములకుఁ బొందు చింతపలి పాటిహరిసేవ నలువుఁడు॥ అన్న॥

—♦ తోహా ♦—

కసికరంబు పలికించి మిగుల వలకారితనంబుగఁ బలికె
అపనయించి నీ మాటలు నల్లన వనరిపాలకుం డనిపె.

గీ. ఏను వచ్చెదననుక యిల
నేలుమని రాజ్యభారమెల్ల తన కుమారకునకు
నొప్పగించి వ్రతము దప్పక
మని విదిశాపురపథమున సంభ్రమమున.

కీర్తన—బ్యాండు.

వేటలాడ వెడలెను రుక్మాంగద నృపతి నూఖేటసాధనములతో వీటఁబుట్టిన వేటకాండ్రతో నాటవిక బలముల్ కోటానకోటు లనుగమింపఁగ॥ వేట॥

కండక్రొవ్వుచేత మహాత్మా-స సీమల్ నింపి మెందుబలసిన గండభేరుండముల్ ఖడ్గమృగముల్ పుండరీక వేదండ వ్యాఘ్రముల బెండువరమ॥ వేట॥

చింతపలిపాటిపుర శ్రీనివాసుని యంతరంగభక్తుఁడు పొంతలఁ బొందమచు రంతులుసేయుచు బంత మెలర్వఁగ గాంతారవీథి॥ వేట॥ —♦తోహర♦—

గహనదేశమున విద్విధమున నుక్కలుఁడు ప్రవేశించి
బహుళంగుల మృగయావినోదముం బాటించె నిట్లంచి

సీ. శార్దూలచయము నిశాతహేతిని వ్రచ్చి
 పటుబాణముల లేళ్లఁ బారఁదరిమి
గండభేరుండవేదండాళి సమయించి
 కిటులబలంబులం గీటడంచి
కంఠీరవముల గ్రిక్కిదలకుండ వధించి
 శరభదుర్భరజవసత్వ ముడిపి
వాలమ్ములేసి సివంగులఁ బోరాడి
 భల్లూకములఁ బెక్కు తుత్రుళ్ళడంచి
తే. గీ. చిఱుతపులులను శరముల జించిచించి
 దోర్బలంబున జింకల దోలితోలి
 జమిలి ముక్కాలిమెకములం జంపిచంపి
 గాటముగ సల్పె భూపుఁ డాఖేట మచట.

వ. ఇట్లు క్రూరమృగాకులమైన యనేకమహారణ్యంబులు జొచ్చి మృగయావినోదంబు నెరపుచు నట్టకేలకుం దోపి పై నికుల కదృశ్యుండై యొక్క కురంగము వెంటఁ దురంగముం బరపుటయు నా లేడి యాశ్రమమృగము గాన రుక్మాంగదు వామదేవాశ్రమంబునకుం గొంపోయి యచట నదృశ్యంబై నంత.

—•తోహర•—

వ్యాఘ్రాత్ముం డీతం డనివిదిశాపురపతిరాక కనుగొని
మాన్యులై యతతాపసు లరుదెంచిరి వన్యఫలంబులఁ బూని

క. ఎదురుగ నా వామదేవుఁడు
 ముదమున రుక్మాంగదుండు మ్రొక్కె వశని ౧౦

పాదవగఁ గుశలమె రుక్మాం
గద యనిదీవించి పలికె గావ మెసఁగన్.

ఆ. వె. రాజచంద్ర మందరమునందు విష్ణుకా
మేశ్వరుండు పార్వతీశ్వరుండు
గలఁడు భక్తలోకకామితకల్పక
మతని గొల్చి శుభము లందుమయ్య.

—తోహరం—

సమ్మతిమీరఁగ వామదేవముని శాసనమున నృపుఁ డరిగి
అమ్మహీధరము దండ సేవలను హయరత్నంబుఁ దొరఁగి
మందానిలుఁ డల్లన నెదురుగ రా మాఱసాల్వ మలరార
మందరాచలం బెక్కి నినకులుఁ డమందానందము మీఱ.

గీ. అచల మెక్కెనో లేదో రుక్మాంగదునకు
నెదురుగోల్సేసి మోహినీ కృతమనోజ్ఞ
వల్లకీగానవినదంబు వలపు మందు
వగిది తహతహఁ గల్పించె భావమందు.

శా. నానాటం జెవులార తుంబురుని వీణాగాన మాలించితి
న్నానాటం జెవులార శంకరునివీణాగానము న్వింటి ము
న్నానాటం జెవులార నారదుని వీణాగాన మాలింతు ము
న్నానాఁ డింతమనోజ్ఞమౌ నటులు వాయింపంగ లేదా ఘనుల్

గీ. అనుచు బొగడికె మీఱ శివాలయమున
బారిజాతముగంధంబు పర్బ్బి కొనఁగ
వీణవాయించు మోహినీవిద్యుత్ మోహిఁ
గాంచె నరపతిఁ గన్నులకఱవుదీర.

జంఝూటి—ఆట.

1 ఎవతో బలువన్నదగా యీజవ్వని నవ్వనాగుహూఁగ
ముతో నవ్వటిల్లుచున్నది॥ ఎవ॥

2 మున్నెన్నఁ డీవన్నెలాడి కన్నది విన్నది గాదు వెన్న
నికోడలకన్న మిన్నయై మెరయు నిది॥ ఎవ॥

3 ముక్కువదీరగ దీని చెక్కులి నొక్కగలిగినచక్కఁదనతో
ముక్కంటి కొక్క ప్రొద్దుండనా॥ ఎవ॥

4 ములుకవవ్వ్రకులుకులాడి తళుకుబెళుకుమాపులది వలు
కునో పలుకదో దీనిభావ మెట్లున్నదో॥ ఎవ్వ॥

5 చింతపల్లిపాటివురీచెన్న కేశవుని దలఁచుచు నుంతయిన
నావంకఁ జూడదింకేమిసేతు॥ ఎవ॥

మ. తనుజేరం జనుదెంచు భూపతిని గాంతారత్న మల్లంతటం
గని యాత్మేశునకుం జనపతికరముం గన్నన్న గావింప నా
వనితల్ డిగ్గున లేచి యేగి రుచితవ్యాపారపారీణలై
యనుమానింపుచునుండ దివ్యనతిడాయంబోయి రాజిల్లనున్

జంఝూటి—జుల్వ.

1 ఎవ్వరిదానవె నీవృత్తాంత మేము దెల్పు గొప్పవారి
బోని సొగసైన కోడమిటారి మరునికటారి॥ ఎ॥

2 తరతరమేలనె నీకుఁ దగినమగవాఁడ నేనె గుత్తంపు
గుబ్బలాడి ప్రత్యుత్తర మీయవె చయ్యన॥ ఎ॥

3 మాటికిఁ జింతపల్లిపాటి చెన్నకేశవునిపైఁ బాటపాడు
చు నీవిమోటి తెలిగించెదవు॥ ఎ॥

—♦ సోహార ♦—

ఎంనాగరో విదితామహాసాగర శీలువాఁడ నేను
కలువగుంటి రుక్మాంగదుఁ డంమరు కరుణింపవె నన్ను
ఆలింపవె నాపలుకులు మరత్రము జాలింపవె లలన
పాలింపవె తన్వంగి మనత్రమునిబారి కోర్కెఁజాల
నాతోడం బ్రియభాషలాడవె నామ ద్దులగుమ్మ
చేతు లొగ్గితి నీచిత్త మ్మెట్లుజేసిన శేయఁగదే.

క. వలరాజుచేతి బంగరు
చిలుకా వలపులకడాని చిత్రరుపలుకా
ములుకనవ్వులుక నాతోఁ
గలికీ పలుకాదవేమి కారణములుకా.

దర్బారు—ఆట.

1 ఏటికి యీ బిగువు నాతో నొక్క మాటాడ నుంకిం
పవు పాటలాధరీ యొక్క మాటైనఁ బలుకవు నోటి
ముత్యాల్ చిందునా పలుకులజంటికేన లూటలూరునా
సుధారసపుతేట జాలువారునా నోటిమాటలకైన నోచి
కొన నైతినా॥ ఏ॥
మాటవిద్యాగుబ్బలైన [illegible] నా
నవరత్నాలవీణె మోగింతునా సరవీటులు గులికింతునా
నవ్యమ్యాటలు నిను జార్తునా మంచిపాటఁ బాడవె మరు
ఘోటి గుణములపేటి॥ ఏ॥

## కన్నడ—ఆట

1 చక్కెరబొమ్మ చాలునె పంతము నీకు-మగఁడెలుప
నె నీ శుభవార్తలు॥ చ॥

2 భూనాయక నను మోహిని యందురు మానుగ బ్రహ్మ
మానసపుత్రికను॥ చ॥

3 ఇచ్చట నుంటకు హేతు వదేమిటి మచ్చకంటి మనసు
మర్మము దాపకె॥ చ॥

4 ఇందుచూడామణి నిష్టకామేశ్వరుఁ జెందామరలఁ బూ
జింపుదు నతతము॥ చ॥

5 మూకలు గట్టి నీ ముందట నిలిచెద రీకలవాణు లేమి
గావలయునె॥ చ॥

6 అనుఁగునెచ్చెలులు నా యానతి మీరరు కనకాంగులు
దేవకన్యలు వీరలు॥ చ॥

7 మరునిబలంబున మది వరియించిన పురుషుఁ డెవ్వఁడె
నీకు పూర్ణచంద్రాస్యః॥ చ॥

8 మనజాగ్రిణి వేయుమాట లింకేటికి మనసుకునచ్చిన
మగని నెఱుంగను॥ చ॥

9 చింతపలిపాటిశ్రీపతి సాక్షిగఁ గాంతరొ నీమనఃకాంతుఁ
డ నేనే॥ చ॥

వ. ఇత్తెఱంగున మోహిని నిజవృత్తాంతముఁ దెలిపియు
వ్రతకారితనమ్ముగఁ బలికియు వలచివలపించియు మోహావిచేష్టి
తంబు నెరపియుఁ జేరాసఁ గల్పించి వ్యామోహసముద్రమందు
మునింగ మగుడను వశముగాక మరల రుక్మాంగదుఁడు.

## కీర్తన.

1 మన్మథసామ్రాజ్యము మదిరాక్షి నిన్నెంచెంతు చిన్మా
త్రి తని పూజింతు చిత్తములో భజింతు॥ మ॥
2 కాలము గడపనేల కాముని విరిగోల బాలికనోర్వఁజాలఁ
బలుకవు కఠినమేలా॥ మ॥
3 పలుమాటలేల్ల తెమ్మ నాప్రాణము నీసొమ్మ చెలిమికి
నీ జనువిమ్మ చేసెద నీ దాస్యమ్మ॥ మ॥
4 చిక్కితి మరున కీడ దక్కితి నీకు ప్రోడ మిక్కవగోల్పు
జాడ మర్యాదగాదు విడనాడ॥ మ॥
5 చింతపల్లిపాటిపురి శ్రీధరుని సాక్షిగోరి యింతటినుండి
కూరి యేపఁ కేఁ జోర నోయూరి॥ మ॥

తే. అనుచు రుక్మాంగదున కని సమరకాంత
వినుచు రవంతయు నింపుగానివలుకు
పార్థివోత్తమ మదివిని ఫలము గలదె
వరపతివ్రతానుమానపిప్రియు ల్ధరణిలోన.

## కీర్తన.

1 పురుషులనమ్మరాదు పో పో పోర సామి మొఱఁగుదు
రు గవారియింద్రజాలములు గురితప్పినమాట గ్గూడ
విచ్చొటు॥ పు॥
2 అక్కరగల్గినయంత లాలింతురు అక్కర దీరిన జూచి
కక్కసేయుదు॥ పు॥

కం. స్యందనమునందవేలుపు
కుందరదనునిడి సేన గొనియాడఁగఁ బు
రంధరవిభవముతోఁ గను
విందుగఁ జేరెను నృపుండు విదిశాపురమున్.

— తోహర —

జనకునిరాకను ధర్మాంగదుఁ డనుచరులవలన నెఱిగి
పరివారములతో మంత్రులతోఁ దనజనకుని నెదురేగి
మ్రొక్కుటయును రుక్మాంగదుండు ప్రియపుత్రుఁ గౌఁగిలించి
అక్కరతో బురజనుల నందర నాదరించె మించి

తే. గీ. మోహినిం దాను గాంధర్వమున వరించు
టాదిగాఁ జెల్లడించి ధర్మాంగదునకు
బ్రహ్మమానసపుత్రి యిప్పడతి నీకుఁ
దల్లివరుసది యని రేను దయ దలిర్ప.

— తోహర —

మోహినిరాకకు ధర్మాంగదుఁడు ప్రమోదంబుం జెంది
ఆ హరిమధ్యను విడియించెను శుద్ధాంతంబుం జొప్పించి.

వ. అంతటఁ గొంతకాలంబునకుఁ గాలక్రమంబున శర
త్కాలం బేతెంచుటయు నా కార్తికమాసమందు.

తే. గీ. మోహినీకృత మయినవ్యామోహమందు
మునిఁగి రుక్మాంగదుఁడు బుద్ధిమాసపోయి
సరసదోహలమున సురమదతిఁ గూడి
పగలు రేలరయకుండెను దగులమెత్తి.

—• తోహర •—

ఎల్లవారువిన పురుషుం డేనుఁగునెక్కి భేరి వైచి వేయు
నల్లివచ్చె నేకాదశి యిదె యని హెచ్చరికలు సేయ
సాటెడువాక్యము రుక్మాంగదునకు శ్రవణరంధ్రములు సోఁక
గాట మైనయుగ్మలి కౌఁగిలి గరమున దిగిచెన్వేక.

వ. రుక్మాంగదుండు తత్తరిల్లుచు పాన్పు డిగ్గి యత్యాతుచ్ఛంబయిన భోగేచ్ఛం దవిలి యేకాదశీవ్రతంబు మరచితి నెంతపాపి నెంతగురుద్రోహి ననుచుం దన్నుఁ దా నిందించుకొనుచుఁ దత్క్షణంబ.

తే. గీ. స్నానమాడి నిష్ఠ సాంధ్యకృత్యముఁ దీర్చి
వ్రతముకొఱకు పరికరములు గూర్చి
సతుల హితుల బంధుసంఘంబు రావించి
పట్టమహిషితోడ భానుకులుఁడు.

కీర్తన.

ఆచరించెను రుక్మాంగదుఁడు హరివాసర మనువ్రతము॥ఆ॥

1 ఆచారవేత్తలు ఆవేళ శుభసూచకముగ పుణ్యాహవాచనములు గావింపఁగ॥ఆ॥

2 తేజరిల్లఁగ గృహమందు మణిదీపికలు పూజాద్రవ్యంబులతోఁ బుష్పహారములతో॥ఆ॥

3 వాద్యకారులు వైభవము మీర హృద్యంబగు పంచమహావాద్యంబులు మ్రోయింపఁగ॥ఆ॥

4 పౌరజనులు విప్రాదులెల్ల వారవధూటులును లాదిగ వందిమాగధులు వేడ్క॥ఆ॥

5 స్వాంతమందు సంశయము మాని చింతపలిపాటిపురశ్రీ
ధరుని ధ్యానింపుచు॥ అ॥

తే. గీ. తుళ్ళిపడి లేచి మోహినీ వల్లవాక్షి
గృహము నలువంకలం బరికించి యెందుఁ
బార్థివునిగానమిం బూలపాన్పుడిగ్గి
తిత్తరిల్లుచుఁ గదలె నంతఃపురంబు.

—♦ తోహర ♦—

కదలినపట్టాంశుకముతోడ ముడిసడలిన వేనలి తోడ
ప్రిదిలిన తాలిమితోడ డాసెఁ బృథ్వీనాయకు నాప్రోడ

వ. వచ్చినన్నాహముం దిలకించి మోహిని క్రోధఘూర్ణితలోచన యై వల్లభున కిట్లనియె.

బేహాగ్—ఏకతాళము.

ఏది రారాద నర్త్య మేది రారాజా ఏది నీనైజమేది భూభుజ॥ ఏ॥ కల్లలాడితివి యిల్లుసొచ్చితివి పెల్లదుఁడ యూవనిఁ బూనితివి॥ ఏ॥ బానకేసి పడబాయనంటివి నానకారి తుదకు మోసగించితివి॥ ఏ॥ ఒట్టుబెట్టితివి పట్టుబట్టితివి గుట్టుకొరకె నాకొంప దీసితివి॥ ఏ॥ వంతగించి చింతపలిపాటి మురాంతకుని పైన నానబెట్టితివి॥ ఏ॥

ద్విపద.

ఓరికృతఘ్నుడ మోరిదుర్మార్గ
యూరార యెంతటిపంతకుడవురా

ప్రోదిగా మనమున్న మోహామంతయును
బూదిలో ఘృతమిడ్డ పోలికగాగ
వల్లభ నీవిట్లు వ్యర్థంబు చేసి
యుల్లంబు మరలింప నుచితకృత్యంబె
నామీదిప్రేముడి నాయమ్మపైడ
నీమోహావార్ధినే నట్లీదుదాన
గడితైన నినుబాయగలన నేనింక
దడవేల కైకొమ్ము ధాత్రీశ యనుచు
గరము గరమునను గదువడింబట్టు
ధరణీధవుడు సురతరుసికిట్లనియె.

కాంభోజి—ఏకతాళము.

వదలవె నాచేతులు భామా లేమా రామా
రామాలలామా॥ వ॥
వదలక యిన్నిట్లు వంచన సేయంగనేల॥ వ॥
పదుగురు నగుదురు పడతిరో యిది మేరగాదు॥ వ॥
హరివాసరవ్రతము జరుపంగ నీకేమిఫలము॥ వ॥
పతిమాట జవదాటు సతులకు సరసముగాదు॥ వ॥
చింతవలిపాట్పారి శ్రీపతినర్చింతునింక॥ వ॥

—• జోహార •—

నాకేటికి మదిజాడికోసంగ నాతిరో శ్రీపతియాన
ఏకాదశులం గలయరాదు నే దేకాదశిగాన
ఓకాంతామణి నీవును నావలె శుభభావంబుండి
శ్రీకాంతుని బూజింపుము కమ్మా చిరసౌఖ్యంబబ్బు

—♦ తోహర ♦—

అగ్రభార్యననుకొని గర్వపుపలుకాడవచ్చినావా
అగ్నిహోత్రమున దంబలిచోన్యం బతివాకెల్లడుపో పో.

వ. అని పవతిమచ్ఛరంబున సంధ్యావళిని దిరస్కరించి మరలివచ్చి రాజుంజూచి మోహిని.

శహాన — ఏకతాళము.

1 లేచిరారా యీవ్రతకేలరా ఆచినేనిద్దురింపకాచి కాల్లదలకుండ లేచివచ్చితివటరా ఛీఛీ మాహాత్మ్య లేచి॥

2 అతికాల్యమున బతిసురత మాసించునత్యవతిని గుందించు దుర్మతివి నతికింపుగాని స్త్రీవ్రత మేమివ్రతము॥ లేచి॥

3 అందబాయక నిరతముండ గలనన్నలోచిరండ యాదుది వేదుచుండ యీబంధతన మేల॥ లేచి॥

4 మాటికి జింతపల్లిపాటి హరిభక్తి మదినాటినాపాటి కోటి నవ్వగ నామాట పాటింపవైతివి॥ లేచి॥

ద్విపద

ఏటిదేకాదశి యేటికార్తీక
మేటికీయుపవాస మేటికీవ్రతము
ధృతిమీర నతుతోడి తెచ్చునాడైన
వ్రతముండెనని చెప్పవలదెభూపాల
పరశివుమోహిని వివాహకాలమున
వరవరనను విడనాడనటంచు
నాదిన వాక్యంబులన్నృతంబులయ్యె

నిన్నింతజేసిన నీమంబు జెరచి
నన్ను గానీవ్రతభంగంబు జేతు.

వ. అని యాగ్రహంబున దక్షిణహస్తముం గ్రహించి మోహిని యాడ్వ రుక్మాంగదుండు.

కీర్తన—ఆరభి.

1 విడువిడుమూ నామోహిని చేయివిడువుమూ పుడమి
వేలుపులు పొంతలనిలచిరి పోవదొడంగెను బుణ్యానమ
యము చెడునన్ప్రియా కొండమెల్ల నీయుడుగుదమ్ము
లకు మ్రొక్కెదను॥ విడు॥
2 పాతివ్రత్యము భంగమగునటి॥ బ్రతికూలముగా నతి
మొలంగుట నీతిగాదు నీవెరుగవా ధర్మము చేతులార
హరిపూజనమ్మాను॥ విడు॥
3 పతియేకార్యము గావించిన దత్సతి॥ జెందనగు సమాన
భాగము మతిసెడి నిర్బంధించెద వయ్యయో యతివా
బ్రతిమాలిన వినవైతివి॥ విడు॥
4 దంతిగమన వ్రతరాజము ముగిసిన దనుపరి నీయిష్టాను
సారము జరింతు కంతపల్లి పాటి నిలయుడగు శ్రీకాంతుని
పదసాక్షిగనమ్ము॥ విడు॥

౮౦. వ్రతము గలదనుచునీతో
నతివా చెప్పుటను మరచి తది మన్నతంబె
రతిసౌఖ్యముగోరి విన్న
వ్రతరాజము విడిగొంట వలతితనంబె.

—♦ దోహర ♦—

వేయిటికేనియు బొంకవచ్చు పదివేలకునైనను బొంకరా
న్యాయము వ్యర్థగాఁ జేయకుండుటె నైజమెపుడు నావంక.

సురట.

మానజాలనికోమలి యీవ్రతమును ॥ మా ॥ మాను
కొనరాని వ్రతమిది ననుమానుమన నేనెట్లుమానుదు॥ మా ॥
భూమినారాజ్యము సమస్తభోగముల వర్జింతుగాని భూవరో
త్తమైకాదశి వ్రతభంగమున కోర్వంగలేన॥ మా॥ ప్రాణపదమై
వెలయు నాప్రియసూనుదునుము మటన్న దునుముదుగాని హరి
వాసరమువీడ మానసంబొల్లదేమందు॥ మా॥ చింతపలిపాటిపురి
చెన్నకేశవుఁడెఱుగడా నాయంతరంగ విశ్వాసము ప్రాణాం
తమైనను భయములేదిక॥ మా॥

వ. అనుటయు మోహిని రుక్మాంగదుని మనోనిశ్చయ
మునకు దిగులొంది ఆహా కార్యంబుదప్పె నింకేమి సేయుదాన
నని దయ్యాన నొకకృత్రిమంబు బన్ని రాజేంద్రునకిట్లనియె.

కీర్తన.

ఓరోరి దుర్మతి యిదిమేరా దుర్మతి గారాబంబున గని
పెంచిన కుమారు దునుముదననోరెట్లాడెను॥ ఓ
స్త్రీహత్యలు శిశుహత్యలుజేసిన దోషిహమెన్నటికి దా
ఁగునరా॥ ఓ॥
చింతపలిపాటి కేశవస్వామి కులాంతకుజేయ పద్ధతి
గాదా॥ ఓ॥

తోహర.

అతికఠినములగు మోహినివాక్యములాలకించి వారగంది
ప్రతివచనంబులు మానియుండెనరపతి విభ్రాంతింజెంది
ఆ॥ అతనికల్పమైన యాలాపములకు
సంధ్యావళి వధూటి తల్లడిల్లి
దుఃఖవార్ధిమునిగి తోడ్తోడ మోహిని
కాంత కిట్టులనియె గదియనేగి.

ఫీల్ — ఆట.

1 శ్రీకుమారునిబోలు మాకుమారునిజంప నీకేమిపగ జేసెన
నిర్దయురాలా॥ శ్రీ॥

2 కాకిగన్నబిడ్డ కాకికిముద్దను లోకోక్తి వినలేదటె నిర్ద
యురాలా॥ శ్రీ॥

3 రాజునీవాడైన రమియింపకె యువరాజు గూల్పనేటికె
నిర్దయురాలా॥ శ్రీ॥

4 ప్రాణముండిన యడవిబలుసాకైనదిని మానుడు బ్రతు
కుగదె నిర్దయురాలా॥ శ్రీ॥

5 చింతపలిపాటి చెన్నకేశవస్వామి కెంత భారమాయెనే
నిర్దయురాలా॥ శ్రీ॥

వ॥ ఓసి నిర్దయురాలా గొడ్రాలు బిడ్డకుబ్బురుంగనునట
కల్లా నీవు గొడ్రాలవుగాన బుత్రుని గడతేర్పుమంటివి కటకటా
నీవాలుకెటులాడెనె యెట్టి దుష్కర్మమున గొడిగట్టితివె చెలుకు
దియ్యనిది యని వేశ్యంట నమలుదురా దురాత్మ్యగాల యీ

భూపతివ్రతంబు మానుప బ్రహ్మాదుల కలవిగాదు నీవా చెరుప సమకట్టితివి చాలుంజాలు. నిలునిలుమని పాపేశ్వరుదిక్కు మొగంబై.

తోహర.

మానవనాయక వినుము మాధవుడో మాధవుడో వార్ధవుడో
మానసశుద్ధి బరీక్షించుట కిమ్మాని బంపగనో వు
కం॥ గాన వృథా శంకింపక
నూనునిదునుమాడి సకలసురలు మెచ్చనీ
నూనృతము గాచుకొనుము
ధరానాయక పొల్లుపోని వ్రతనియమముకై॥

వ॥ తొల్లింటిపెద్దలు తమతమ పుత్రకళత్రములనైన న న్వశరీరంబునైన ధారవోసి యశోధనం బార్జించిరని వింటిమి యీరీతిగ్గున సాహసించి వ్రతహానికాకుండఁ జక్క జేయుఁడని బోధింపుచుండు నమయంబున మోహిని మరల నిట్లనియె॥

హిందుస్తానితోడి.

1 యీశు లేఁకరుణ మా కేటికి భూరముగా యీ కుమారు
జంపికొన యీకేబుద్ధి బాడమోనా॥ యీ॥
2 చంపుము రాసుతుని పరికింపుము ముందుగతిని జంపవేని
వ్రతము వర్జించుట నామతము॥ యీ॥
3 చింత పల్లి పాటి హాఁ సేవ మదిని నాటి వంతమున సాటి
పరభామ కరవమైన మేటి॥ యీ॥

తే॥ గీ॥ తల్లిదండ్రులు వ్రతముకై తల్లడిల్లు
భంగి వినితానభేదభావంబు యీర

సములగుణాఢ్యుఁడైన ధర్మాంగదుండు
సరగవిచ్చేసె నాపత్రిస్థానమునకు॥

కం॥ వచ్చినపుత్రుని గనుగొని
మచ్చికతో నెదురుపోయి మనుకులతిలకుం
డచ్చెరుపడి వాని గౌఁగిట
గ్రుచ్చి దయారసము గడలుకొన నిట్లనియెన్॥

జంఝూటి—ఏక.

1 రమ్మిక సర్వోత్తమమగు వ్రతరాజముగందువు కదలి
వేగిరము॥ ర॥

2 కమ్మనివిలుకానిమించు గారాము ముద్దులకొట్టి॥ ర॥

3 ఇందిరకు ఫణిశయనునకు నిలువేల్పులకు మ్రొక్కుము
బిడ్డా, వందనమ్ముజేసి సభకువచ్చి కూర్చుండుము॥ ర॥

4 వ్రతములై మీఁపవతమ్ములో బ్రతినబూనుకొంటి నేడు
క్షితిలోన ధర్మస్యత్వాకాగతియనివచియింతు గాన॥ ర

5 చింతపలిపాటిపురి చెన్నకేశవుపద లోనమ్మి నిశ్చింత
బూని కొడుకానీదు శిరముగోయఁ బిలచితిని॥ రమ్మి॥

తే॥ గీ॥ అనిన దనయుఁడనియె వయ్యవనీవకాద
కీవ్రతంబుకొఱకు చేసినట్టి
ప్రతినదీర్పువాడు ప్రాణ మీయవచ్చి
యంతకంటెఁ బుణ్యమద్ది తండ్రి॥

తోహార.

సందను దుమమాగరాదను నీమది సందిగ్ధంబుడిగి
పొందుగనిప్పని సాగింపుము గోవిందుని గొనియాడి॥

వ॥ అదిగాక యనిత్యంబు జరామరణ దూషితంబు వ్యాధిగ్రస్తంబు జుగుప్సితంబైన యీశరీరమందు నాకు మమతాభిమానంబులు లేవు వ్రతముకై శ్రీపతికి దేహమర్పించి శాశ్వతసుఖం బనుభవించెదనని పద్మాసనస్థుడైన కుమారుం దిలకించి రాజపరమేశ్వరుండు.

— తోహర —

కరఖడ్గము ఝుళిపించి యెత్తబోగా మోహినివీక్షించి
ధరణీశా నిలునిలుమని పలికె స్వదక్షిణకరము గ్రహించి

కీర్తన.

కన్నకొడుకుం జంపనేటికి॥ అయ్యయ్యో॥ క॥
ఎన్నోనోముల్ మున్నునోచి చిన్నారిపాపని గన్నవార
లో కన్నమమకారము గాలిపోయెనా॥ క॥
క్షితిలోకులలో సుతహీనులకుగ గతులు లేవనుచు స్మృ,
తులు మొరలిడ గతియెటులుంగ వేరా మతివిహీనుడా॥ క॥
యింతలంత లంతేదిరా చింతపల్లిపాటి శ్రీవాణిసాక్షిగ
హంతకుడా చాలుంజాలు నిల్వరా॥ కన్న॥

— తోహర —

అటుగానినియు కేయుజాలక హాదివాన వ్రతమునకై
వరతనయుని దెగటార్పంబూనితివి వల్లభ ఛన్నిదముకై
దబ్బరపల్కులు మానుంటమునది ధరణిప కొండునులేదు
మబ్బురమిత్ర చెంతవునియ ప్రేంపుట మానమిట్టిపనికగదు.

వ. అని రాజునకు మెప్పుబుట్టం దెల్పి ధర్మాంగదునిం జూచి.

ఫీలు—ఆట.

1 లేచిపొమ్మా తనయా లేచిపోవయా నీచమరణమ్ముగోర నీకేటికయా॥ లేచి॥

2 తల్లిగాదిది పెద్దదెయ్యంబుగాని తల్లితనయునిపైన దయ దప్పునటరా॥ లేచి॥

3 తండ్రిగాడువీడు దానవుడుగాని తండ్రి కొమరుని జంప దలచునా కత్తా॥ లేచి॥

4 శూరధర్మముగాదు సుతుడ లేలెమ్ము వీరస్వర్గముతోను వాలకి కొనుమయ్యా॥ లేచి॥

5 రాకుమారునకు బరాక్రమునికి నేకాదశీమరణ మెందైన గలదె॥ లేచి॥

6 చింతపల్లిపాటి చెన్నకేశవుడు గొంతుకోసకు ముక్తి గూర్చునాబిడ్డ॥ లేచి॥

వ. మరల రాజు దిక్కుమొగంబయి యిట్లను కరుణాత్మా దయా! ఇంకను కత్తిడింపవుగా కొడుకుం జంపి కోడలి గో డెట్లుచూడగలవు చూడంబోడ నీనడువడి కాల్చిపోను రోకలి తలకుం జుట్టుమన్నట్లున్నది.

ఆ॥ వె॥ ఒక్కకొడుకుగాని పెక్కండ్రిగాడము

దిక్కువీడె నాకుc దేరిచూడ

మూఁడుపేరు లేని పేరానఁగూర్చు నీ
వ్రతము దేవుడెరుగు వదలుమిపుడు॥

వ॥ నాపుడు రుక్మాంగదుఁడు చిఱునగవునగి బ్రహ్మాం డాదు లద్దపడినను బ్రతిజ్ఞమాననని మోహిని నవ్వాలకం దోఁచి॥

తోహర.

కేలనున్న ఖడ్గమున వ్రేయగా శ్రీలోలుని కృపచేత
పూలహారమై చుట్టుకొనియె రాపుత్రుని కంఠంబునకు
మరలనొక్క కరవాలము విసరి కుమారుని మెడ కవ్వేయగా
విరిగి తునకలై నేలబడియెనా వేఁఘు వెలంది యరయగా॥

వ॥ అత్తరి తనయత్నంబు నిష్ఫలంబగుటకు రుక్మాంగదుండు వెరగంది తనలో హా దైవమా! యిదియేమియింత యనేక శత్రురాజన్య శిరోనికృంతనంబగు నాయుధము రాచపిన్న వాని కంఠనాళముం ద్రెంప నోపదయ్యె. వాడి చెడెనో లేక యస్మద్దోస్సారంబు నిస్సారంబయ్యెనో గాక యిది పరాత్పరునిమాయయో తెలియఁజాలనని మహాక్రోధంబున వేఱొండు కరవాలము గేలనంకించి యుట్టనియె॥

తే॥ గీ॥ వేదములునసత్యములగునేని విష్ణుపాద
భక్తి నాయందు నిశ్చలుంబ్రబలునేని
సత్యవంతుఁడ నేని యీసారి సుతుఁడు
కంఠలుంఠనుడగుగాక కత్తిచేత॥

వ॥ అని కుమారుని నరుకఁ బోవ భక్తపరతంత్రుం డైన భగవానుఁడు పక్షివాహనుఁడై తత్క్షణంబ సాక్షాత్కరించి ధర్మాంగదున కడ్డమై॥

కీర్తన.

ఆగుమాగుమోయి భూపతి రుక్మాంగద॥

1 వేగిరింపవలదు నీచరిత్రము మెచ్చుకొంటి॥ ఆ॥

2 నీమనస్సంశుద్ధి దెలియఁగా రాజేంద్ర సురకామిని మోహినివచ్చెను కామితదిగా జేశ నీనోము సఫలమాయె నేఁడు॥ ఆ॥

3 చింతపలిపాటివ్రతము నా జెంగుమాగ్గమ్మెట్టి చెన్న కేశవుఁడ నే నేరా సంతతంబునీకునాదు సాయుజ్యపదవి నొసగితి॥ ఆ॥

ఆ॥ తత్క్షణంబయెకుట సాక్షాత్కరించిన
దివ్యపురుషుఁ విష్ణు దేవుఁ జూచి
వాలుక్రింద వైచి కేలుంగవమోడ్చి
భాగవతుడు మిగుల బ్రస్తుతించె॥

కీర్తన.

1 నమ్రయించెదనిను జగదాధారా॥ శరణాగతజన భయ విమోచన శార్ఙ్గకరానన మోక్షసాధనా॥ న॥

2 మత్స్యరూప కూర్మస్వరూప యచ్చాచ్చ నృసింహా వరాహావతారా॥న॥

3 రామారూప రఘురామరూప బలరామరూపయో వామనరూపా॥ న॥

కం॥ ఏకాదశీ మహాత్మ్యము
ప్రాకటముగ నెవ్వరేని బఠియించినచో
శ్రీకాంతుని కృపచేతను
వైకుంఠావాసమబ్బు వారలకు దుదిన్॥

ఇతి శ్రీ మద్వంగల చిన్నికృష్ణ కవిప్రణీ
తంబైన రుక్మాంగదచరిత్రము
గేయ ప్రబంధము సర్వము
సంపూర్ణము.



శ్రీ వాణీ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము

